# ఉలూచీ పరిణయ నాటకము



ఇది

తణుకుతాలూకా భట్లమకుటూరుగ్రామ నివాసులగు

నపసీని వెంకట్రామరాజ కవిచే

రచియింప బడినది.




మొదటికూర్పు —500 ప్రతులు

కస్తూరి శివశంకర కవిగారిచే

సుదర్శన ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

నర్సాపురం.

1915


 వెల 0-6-0

# పత్రిక.

ఇచటకు సామీప్యనాటక సమాజముల వారును,మరికొందరు నాటకరస కృతోల్లాసులును, వీలైనంత వరకూ, నంత్యప్రసోక్తమైన ప్రోజును అక్కడక్కడ సంగీతపుమట్టులును గలుగు నటుల జెప్ప వలయునని కోరగా, నంతకు ముందరే నియ్యభిప్రాయము మదీయాంత రంగంబున బొడమియుండుటచేత నేనీ నాటకము రచియించితి. నవరసజ్ఞులగు వార లిందెక్కడైననూ, నూరుగుణంబులలో నొక దోషంబుగాంచినను, చంద్రునకు పదియారు కళలలో నొక కళంకంబు దూష్యంబుగా నటులనే, యిదియూ దూష్యంబు గాదని యూహింతురుగాక- తదితర జనులెట్లన్ననూ,హృదయ కాఠిన్యము లేక సిరసావహించు వాడను.యిందుల కొందరు,హర్షించని వారలందరూ రసహీనులేనాయని యాగ్రహింతురేమో- ఔననియనుటకు నేసమర్థుండ గానుగాని, పండితులు పరనిందకాయరని పెద్దలు వక్కాణింతురు-

ఆంధ్రరంగ స్థలమందలి సుప్రసిద్ధ నట శేఖరులును, వై. యన్. కే. వి. నాటక సమాజాధ్యక్షులును, సుదర్శనీ పత్రికకు సహాయ సంపాదకులును,నాకత్యంత మిత్రులును, నగు శ్రీయుత బొమ్మకంటి కృష్ణమూర్తిగారీ నాటకమును ప్రదర్శనానుకూలముగ నుండునటుల సంస్కరించి, త్వరలో ముద్రింపజేసి నాకు సహాయమొసంగినందులకు వారికి నాకృతజ్ఞతాపూర్వక వందనము లర్పించు చున్నాడను-

భట్లమకుటూరు,పొలమూరు పోష్టు, తణుకు తా॥ కృష్ణా.
24—6—1915 సం॥రం

ఇట్లు
భాషా శేవకుడు
జినపనీని వెంకట్రామరాజు

## —ఈ నాటకమునందు వచ్చు పాత్రలు—

| | |
|---|---|
| అర్జునుడు— | పాండురాజు కుమారుడు, |
| విశారదుడు— | అర్జునుని ముఖ్యస్నేహితుడు |
| యోగిని— | చంద్రరేఖయను ఉలూచి యొక్క చెలికత్తె. |
| బ్రాహ్మణుడు— | తపశ్శాలి. |
| చోరులు— | దొంగతనముచే బ్రతుకువారు. |
| ధర్మరాజు— | అర్జునుని అన్నగారు. |
| మంత్రిలు— | ధర్మరాజునకు హితవు చెప్పువారు. |

## —స్త్రీలు.—

| | |
|---|---|
| ఉలూచి— | సర్పరాజు కూతురు. |
| చంద్రరేఖ— | ఉలూచి పెద్దచెలికత్తె. |
| సుగుణవతి— | రెండవ చెలికత్తె. |
| మీనాక్షి— | ఉలూచి మూడవ చెలికత్తె. |

# శుద్ధపత్రిక



ఈగ్రంథము జదువువారి శుద్ధపత్రికనుబట్టి తప్పులను సవరించుకొని చదువుకొనునది.

| పుట. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 8 | 8 | త | తమ్ము |
| 8 | 10 | బాందు | బాంధు |
| 9 | 8 | సీవు | కీవు |
| 15 | 16 | పదహారు వన్నె బంగారమువలె | యింద్రనీల మువలె |
| 15 | 17 | నల్లబారి | తెల్లబారి |
| 26 | 14 | లేను | లేదు |
| 30 | 3 | దెందం | డెందం |
| 34 | 1 | మాన | మాస |
| 35 | 19 | బడచు | బదుచు |
| 37 | 7 | హరికట్టి | అరికట్టి |
| 40 | 9 | సూనుడ | సూనుడు |
| 41 | 13 | పదును | వదును |

| పుట. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 41 | 14 | లేచి | లేసి |
| 42 | 8 | తిరుగు | దిరుగు |
| 44 | 8 | దప్పు కా | దప్పులా |
| 45 | 6 | తెలుసు | దెలుసు |
| 47 | 5 | పది | బది |
| 50 | 7 | చేసెద | సేసెద |
| 50 | 12 | నేనుం | నేను |
| 51 | 13 | పులక | బులక |
| 52 | 3 | చిల్క | సిల్క |
| 53 | 2 | వృద్ధుడగుటకును | వృద్ధుడగుటను |
| 55 | 14 | లోర్తు | లోర్తున్ |
| 62 | 9 | చినే | చిసే |
| 64 | 1 | కూర్చిరుండ | గూర్చిరుండ |
| 65 | 2 | చిలక | జిలక. |










# ఉలూచీపరిణయనాటకము.

నాంది

శా॥ శ్రీలక్ష్మీకుచసారసంబుల పయిం జెల్వొప్పఁగా నిచ్చలు
వ్రాలంబద్వయమూడనా యనుభ్రమ న్భ్రాజింపహర్షంబున
గ్రాలుల్లాసపడి నిత్యుఁడాద్యుఁడు హృషీకేశుండు గారుణ్యస
స్ఫీలుండై నఘవారి బ్రోచు నధిక శ్రీసంపదోత్కర్షంబుగన్॥

సూత్ర—(తెరవంకజూచి) ఓయీ పారిపార్శ్వకా! మీయలంకారము బూర్ణంబయ్యెనేని నీవొక్కసారిటు రమ్ము-

నటుడు—యిదుగో, వచ్చినాఁడ నేమి సెలవు-

సూత్ర—నేటిరాత్రి వీరలసభా మనమానందింపజేతుమని- యీసభాసదులందరును- మన నాట్యశాలను జేర్చి- దయచేసినారు- వీరలొకరకముజూడ- వృత్రాసుదుని కోడి విష్ణువుని బ్రాణరక్షణ చేయుమని ప్రార్థించి- యా

భగవంతుండేమియానతిచ్చునో యని- యాలోచించెడి య
నుమిషులవలె- ననిమిషులై- మనవంక నెట్లు వీక్షింపుచు
న్నారో చూడుము-యిదియు మనలగురించియె-యేమన-ని
ది నూతననాటకమనియు మృదుమధురశైలి గలదనియు-పు
గాసనమునుంచి- సకలవిద్యావిశారదులగు- భట్టురాజ వం
శజపరిణీతంబనియు మనమిదివరకే తెలియజేసినాము-గను
క నాలస్యముశాయక-నీ పుల్లూచీపరిణయ నాటకరత్నమును
పక్రమించి- యీ సభ్యులనానందింపజేతము-

నటు—బాగు బాగు! నెంతచక్కనగా సెలవిచ్చితి
రి- సరిగా నోట- మాట- రాని మనబోటుల విూ మేటి వి
ద్వాంసుల- నెట్లు రంజింపజేయనోపుదుము-

సూత్రి—నీవట్లు వెరువనక్కరలేదు- యీ మహా
గుణులకు తనయులపై ప్రేమాతిశయముచే వారు బల్కెడి
పల్కుల తప్పులున్ననూ- గాన్పించనటుల- యీనూతననా
టకమార్ధవంబు ముందు- మనచేతగాని మాటలు-వీరి హృ
దయగోచరమగునా-

నటు—యిది సరిగాని- యిక్కవిసింహుని నామా
దు- లెవ్వి-

సూత్రి—ఓయీ స్థాపకా- షోడశసుగంధవృత్త
మాలయను. హరిస్తవమందు—ఉత్పల—

ఉ॥ శ్రీ ఖణతీనివాసమగు॥జిన్ననివంశజుడన్ సుకీర్తిసం
దీపితసుబ్బరాట్ప్రియస॥ తీమణిబుచ్చమకూర్మిపుత్రుడన్
నేపటుకబ్బమందు బహు॥నేర్పరినారుపభట్టువంశల
క్ష్మీపతిరాజను గ్రహము॥చే మనువాడనువెంకటాఖ్యుడన్॥

అను పద్యములో- వారియింటిపేరు జినపనీని వారనిన్ని తండ్రి సుబ్బరాజు-తల్లి బుచ్చమాంబ-తనపేరు వెంకటాద్రి రాజు అనిన్ని తన మేనమామయగు అరుమభట్టు లక్ష్మీపతిరాజు చేత తామందరు రక్షింపబడితిమనిన్ని యిక నొక పద్యమందు భట్లమకుటూరి నివాసుడననిన్ని వ్రాసుకొనుట నీకింకనూ తెలియదా?

నటు:—(స్మృతినభినయించి) ఆహా! మరచితినిగాని యీయన కేక గర్భజనకు లేమైననూ గలరా?

సూత్ర—బాగుబాగు! వీరరాజనెడి యగ్రజుండును పద్మరాజనే యనుజన్ముండును గలరు-

నటు—వార లేమైననూ ప్రసిద్ధులా యప్రసిద్ధులా.

సూత్ర—చాలుచాలు నీదగ్రజుండు భీమబలుండును కృషిశాస్త్ర నేర్పరియు అను జన్ముడు దిట్టమగు ప్రాణికుండును. వీరలే గాక వీరి సాంప్రదాయకులందరునూ నామకులుగాని యనామకులుగారు-

నటు—బాగుబాగు! యిక నొకపద్యము తెలివిచ్చితిరే- యదికూడ నాకర్ణింపవలెనని మదీయాంతరంగం బుఱ్ఱలూగుచున్నయది గావున ననుగ్రహింప వేడెద-

సూత్ర—నాకును సంతోషమే యిందులకింతగా ప్రార్థింపవలెనా వినుము—

గీ॥ సుకవిభూషణపురనివాసుఁడ,
నకలంకవు భట్టుకులుఁడ నగునేను వారి
సుకవిజన ప్రియదంబుగా,
నాటకషోడశమాల కృతిగ నొసగితిగొనుమా॥

నటు— శాభాష్! యీకవి యీనాటకమొక్కటేనా యింకా గ్రంథాదులేవియైన రచియించెనా?

సూత్రి— అయ్యో! అలంకార సౌందర్యమను కొండలరాయవిలాసమును సుదర్శనచరిత్రమను శ్లేషకావ్యమును సావిత్ర్యుపాఖ్యానము హరికథయు యీశ్వర శతకము వేశ్యాభరణమను జావళీలు మొదలగు గ్రంథములు చేసినారు. మొంతోవయస్సా! అన్న యిరువయ్యి సంవత్సరములుండునేమో—

నటు—సరిసరి అలాగునా? అది సరిగాని వీరు బహుచిత్రములగు యీమాటలతో ప్రస్తుతకార్యమును మరచితిరి—

సూత్రి—ఓ నవ్రుసు. సభవారు త్వరపడుచున్నారు గాన శీఘ్రముగా యీనాటకమాలంబున సభారంజకయత్నము చేయుదముకమ్ము—

(ఉద్దరిస్తు నవ్య్రియించుచున్నారు.)

ఇది ప్రస్తావన.



# ఉలూచీపరిణయనాటకము.



## ప్రథమాంకము

రంగము—ఇంద్రప్రస్థము

(అర్జునుడును విశారదుడును ప్రవేశించుచున్నారు.)

అర్జు—(విశారదునివంక జూచి) విశారదా! నాకిద్దినంబున నెద్దియుఁ దోచకున్నయది.

విశా—బృందారకాధిపనందనా యెందుచేత?

అర్జు—కందర్పజనకుడగు దేవకీనందనుని బొందు దక వాసరంబులనుంచి పొందకుండుటచే

విశా—యిందుల కేమి చేయుదము.

అర్జు—విశారదా! మన డెందానందులగు నెచ్చెలి బృందంబులఁగొని యుద్యానంబునకుఁజని. యిచ్చకొలంది యందందుల ముచ్చటించివత్తము. గాన పొందుకాండ్రను బిలువుము.

విశా—రాజా మహాప్రసాదము. (అని నిష్క్రమించుచున్నాడు)

(విశారదుడు మరికొందరు చెలికాండ్రు బ్రవేసించుచున్నారు)

విశా—రాజశేఖరా! భవదాజ్ఞానువర్తులైన చెలికాండ్రిగో వచ్చితి.

అర్జు—మహాసంతోషము. ౮౦|

ఉ॥ ఓసఖులార నామనము నొక్క మనోహరముండిమిమ్ము
దీసుకురమ్మటంచతని దీవ్రిమె పంపితిమద్వనంబున।
న్నాసురలీల నాటలును బాటలు వాడిదగన్విహారముం।
జేసి బిరాననచ్చెదము శీఘ్రిమెరండు ముదంబుతోడు
చెలికాడు— (తన॥)

కం॥ ఓరాజ మీయనుజ్ఞకు।
మారాజెదమయ్య మేము మాతో మీరల్।
యూరక చెప్పగవలెనా।
గోరిక వేంచేయుడయ్య కోమలదేహా॥

రంగము వుద్యానవనము

(అర్జునుడును విశారదుడును చెలికాండ్రిను బ్రవేసించుచున్నారు)

అర్జు—(చెలికాండ్రివంకజూచి) విశారదా! యీవనవైభవంబున్నన నా మనంబున ఘనంబగు ప్రమదంబు జనించుచున్నయది. ఆహా! యీ కీర శారిక మయూర మరాళ కోవెల కలరవ కపోతంబుల సంకులధ్వని నాహృత్పంకజంబుగలంచు చుండెగదా-

విశా—ధనంజయా! మనమనంబులు గలంచుటొక ఘనంబగువింతా! కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాది వికారంబులను తనయదారాదులను విడచి వనని నమచిత్తులైన మునిపుంగవులే గలంగుదురు మన మనసెంత?

ఉ॥ ముందరజూడు పార్థ యదె మోదముచే నిటు లేగుదెంచునీ
జందముజూచి నీగురుడు సక్కగయాకసవీధి పైనియా
నందమలర్ప దీపముల నద్భుతశక్తిని మార్చెనాయనే
సందియముద్భవించు నహ సంపెగ పువ్వుల జూడుమిత్రమా

కీరవాహనుండు మీరి వారిజాక్షుల పై దండెత్తుతరి చేరువనుంచిన పిరంగిగుండులాయను గోరిక బోడముచున్న నారింజపండులును భూరుహంబులను ధీరులు తీరని కోపంబుల నారాచంబులగొని శరీరంబుల దూరసేసుకొన రుధిరము బారి చిన్నచిన్న క్షతములాయను కోరిక బోడముచున్న మోదుగుపువ్వుల చారును పంకజాక్షుని పుత్రుండు శంకరుని జయించు బింకంబున విసర లోనికింజని రక్తపంకంబున మునింగి తిరిగి వచ్చుతరి మేనిపైగల విభూతి నింకించెనాయను శంకదోచుచున్న కేతకీకుసుమదళంబులా జూడుము

అర్జు—ఆహా! యెంత మనోహరముగానున్న వి-

చ॥ గనుము విశారదా యిచట కాముని బారికి నోర్వలేక యా
వనితయనేక భంగులను వాంచను గుందుచునుండె వేగ మే

చనుమని బొన్న వృత్తువిట్టు చయ్యానలా గెడుతొర్ప్కకైయా
యతి మదిదోచుచున్నదదె యందపుతీగను జూడువచ్చలీ॥

రాగం— జంజూటి— తాళం— యేకతాళం

ప॥ అరపాలమును గాంచవిశారద। యద్భుత మొదవుసుమీ।
అహాహా! యద్భుత మొదవుసుమీ। ధారుణీల। తొం
గినల్పు తాంబూళీ। ద్యుతియన్॥ అర॥

(2) కమ్రనిబూగుత్తుల పైతేటులు। జుమ్మనిమ్రోయుటలా।
తళరుని రమ్యటంచు। నగబిల్పువిధమ్మునుండె॥అ॥

(3) కోకోయనుచును రొదచేసెడియా। కోవెలత తిజూడన్॥
భాకశాస। నాదమ్మైన। బాంసులుగా కుందురే ॥అ॥

సఖా! యీసరోవరంబు పరిమిళయుక్తంబులగు పద్మము
లకు శరణమై యిరవందుచు నలుదిక్కుల తరుచ్ఛాయలచే
చైత్రిపై శాఖమానంబులందైన చలిపుట్టించగల సామర్థ్యం
బుగల్గియున్నదిగదా! బళే! దీనిజూచుటచే నాడెందంబు గో
విందునితో విహరించు నప్పటికంటె యానందంబు నొందు
చున్నయది.

విశా—రాజశేఖరా! యీచారువనంబెంత కాలంబు
జూచినను వింతగానే గాన్పించు గాన, యానురపొన్నల చెం
తకుజేరి కించత్కాలము విశ్రమింతము పేంచేయుందు—

అజ—అటులనే బోదము (అని నిష్క్రమించు
చున్నారు.)

యోగిని.—

సీ॥ కాకతీరిన మేల్మి॥కాంచనతుల్యంబు
ఆఃహ లలామ॥గేహంబుడంబు।
భళిరయీపత్సల్లి॥పంకజంబులమీరు
లేమబింకంపుపా॥లిళ్ల సౌరు।
లాకార రాకాశు॥ధాంశుతో జోడల్మి
కాంతామతల్లిము॥ఖంబుకల్మి।
యిలనవచిగురుటా॥కుల సౌష్టమును గేరు
తరళాక్షి మృదుపద॥ద్వయముతీరు॥

గీ॥ కానుసింహంబుగన్నులు॥గలువరేకు
లర్జునాయేమి చెప్పుదు॥నతివసొబగు
ధారుణిస్థలిలేరామ॥తారిసములు
నారిగాదదిమర్త్యుచేక॥తారిగాని॥

అర్జు—యోగినీ! యామాతంగ గామి నెవ్వనిగూతురై యుండును?

యోగి—బిడౌజనందన! అయిరావత కులోద్భవుండగు ధృతరాష్ట్రుని పుత్రిక-

అర్జు-సిద్ధురాలా! యాతొయ్యలి నామంబెయ్యది?

యోగిని—విజయా! వులూచి యను పేరుచే నలుదిక్కుల ప్రఖ్యాతిగాంచె నిందుకులాబ్ధి చంద్రమా! యామందగామినికిని నీకును బొందుగల్గిన కందర్పరతీ దేవుల

క్రిందుచేసి ప్రసిద్ధి నొందజాలుదురు. హాయిహాయి. చందనబొమ్మకెటో మరుని సాయకమోయని డెందంబున సందియంబుగల్గు యీసుందరికి మిన్నలెందును గానరారు-

అర్జు——యోగినీ! యీ కమలనేత్రికి సముత్తందును లేరని వక్కాణించితివి. దమయంతికన్ననూ నెక్కుడా యేమి-

యోగిని——

కళ్యాణి—— ఆట ——

కలువకంటికి తుల్యులీభువి। గల్గు స్త్రీలలో లేగహా।
పలుకువెలదుకమగనికైనను। భారమా వినుతింపనూ॥
1 యిందువదన మరేంద్రపురిగల। మందయానలకన్న దా।
నందగత్తె నిగీర్తి జెందెను। జంద్రవంశజ యెందునూ॥
2 నీకుదానికి బొందుగల్గిన। లోకమందరు మెచ్చునో। బాకశాసన బుత్రియిందుల। బద్ధమేమియు లేదుమీ॥

రాజా! నల్లచీమల చాలు జోలు బాలికామణి యీరును ఫుల్లారవిందంబుల నుల్లఘించు పల్లవాధరి పాదయుగళంబును సంపెంగపువ్వుల సరకుగొనని యించుబోడినాసికయును గువ్వలనుజూచి హేళనభావంబున నవ్వసాగుయీ జవ్వనికుచయుగ్మంబును కుందంబులు తమకందంబునకు సరిగావని నిందించుచున్న యిందు ముఖరదనంబులును కుముదబాంధవుండు తమకు నమముగాదని నిరసించు యీ కామినివెూ

మును ఆహా! రాజశేఖరా! యీభూమియందు కామకేళికా బాములభించువాని భాగ్యమేమనిచెప్పుదు కానిమ్ము భగవదనుజ్ఞయెట్లున్నదో ధనంజయా, సేవచేయుచున్నదాన (అని నిష్క్రమించుచున్నది.)

అర్జు—(తనలో) ఆహా! యట్టి యింతితో కలుసుకే లిగూడని జన్మంబంతయు వృథాయై తోచుచున్నది. అయ్యయో! హాగ్యయాము కుదురదయ్యె యీ మరుపికరంబులా చెలికాంచని దలిసి నేని నగుబాట్లపని గాన కొంచెము దూరముకేగెద (అని నిష్క్రమించుచున్నాడు)

సీ॥ చేడెసతోఁ బొందు ♦ గూడ లేకుండిన
　　జన్మ మేలను బంధు ♦ జనము లేల|
పడతిసియధరోష్ఠ ♦ పానమ్ము గ్రోలక యున్న
　　స్థిర లీలమంత్రికే ♦ సచివులేల|
కాంత రోసిను వేట్క ♦ కౌగిలించక యున్న
　　భోజనంబేలను ♦ భోగమేల|
కలికిని కుచగిరుల్ ♦ కరములకవారని
　　బ్రాణ మేలను రాజ్య ♦ పాలనేల|
గీ॥ మక్కువనుజేర నిన్నునా ♦ యక్కుజేర్చి
మెత్తసజ్జను బన్నుండి ♦ చిత్తమలర|
నకటమరుకేళి దేలిలో ♦ లాడకున్న
లోక మేలను సుతపత్ని ♦ నీకమేల॥

ఆహా! కన్నియా! నీ పేరు నే విన్నదిమొదలు నాహృదయంబు నీ కుచహేమగిన్నెలపై నివాసంబుగా నున్నది. దాని నా కెన్నఁడైనను గాన్పింతువా లేదు లేదు. నావంటి వానికా! యెన్ని నోములు నోచిన వానికి నీవంటి సన్నుతాంగి లభించుట-

సీ॥ క్రోక్రో యటంచును గోవెల గూయగా
కలికి పిల్చితివంచు నులికిపడితి।
నాలోలపల్లవం బాలోకనము సేసి
కాంతకై సన్నఁగాంచు భ్రాంతిపడితి।
సతిసుందరంబైన యతను నేవీక్షించి
భామ నీ వేయంచు భ్రమనుగంటి।
పోలుపారవికసించు పుష్పగుచ్ఛంబుఁజూచి
పంతి నీ చనులంచు బట్టఁబోతి।
గీ॥ కతిపమిడనాడి గవ్వంత కరుణబూను
మింత మోహంబుతో నుంటి నెంత మేలు॥
జాగుసేయంగబోకవే వేగవచ్చి
సన్ను మన్నించు కూర్మితో సన్నుతాంగి॥

బేహాగ్ రాగం—— ఆది—— తాళం

సిరిగామిని నీమనసమున। గఠినమూనకే।
యీ తరిదరిశనమివ్వకున్న। దాళజాలనే॥

2 తరళాక్షిరో నీపై మది। దగిలియున్నదే।
సరగున వేంచేసి। నన్నుగరుణనేలవే॥

3 మదికుదరకనీకై నే। నెదురుచూచుచు।
ముదితా యిట। తిరుగుచుంటి। ముద్దులియ్యవే॥

ఔరౌరా! మారుండు క్రూరుండై యొక సారసపత్త్రంబును బెరికి నేతుపున మిక్కుటమైన ధారపోసి సారంగంబును నారిగాఁబూని చెరుకును విల్లుగాఁగొని కీరవాహనుండై కోరు వంకలను సేనతో కదనమున కేగుదేరి మీరి నేరమెన్నక నారాచంబు నాయెద దూరనేసిపోయె. అయ్యయో! యెట్లు తాళుదు? యీకంతునట్లుండనిమ్ము యింతవరకు గొంతు కోతలమారియగు యీ వసంతుడే పొంతనున్నవాడు అకటా! యీ మోహబాధ నెంతనిసహింతు-

సీ॥ తరులారవనమత్త • కరులారనా వెత
దెల్పుడా కాంతతో • తేటపడగ।
లతలారబర్హిణ • తతులారవేగమే
నాగతి జెప్పరే • భోగిసుతకు।
పన్నగవరులార • పాలశకునులార
నాస్థితి దెల్పరే • నాతితోడ।
కలరవగములార • ఖంజరీటములార
నా చిహ్న దెల్పుడు • లూచితోడ।

గీ॥ గరుడ కోకిలశుక బక • కాక ఘూక।
శ్యేన చెటక మరాళాది • శ్రేణులార
వృషభ భల్లూక గోకర్ణ • మృగములార
నాదువలపంత దెల్పుడా • నాతితోడ॥

(విశారదుడు ప్రవేశించి తనలో)

విశా—అహా! యీ యింద్రనందనుండు కందర్ప బారిబడి యందందుల తిరుగుచున్నటుల తోచుచున్నయది గాన నీచెలికాండ్రవని నెపంబున నీట్కాల్పి నేనతని పలికించి హితవుబోధించివారించెద (అని అర్జునుని సాన్నిధ్యముంజేరి ప్రకాశముగా)

గీ॥ యిందు వంశజయొంటరి • నిట్టులిందు।
గుంద నేటికి యలసట • జెంద నేల
పిలచినను మారుపలుకవు • పిచ్చివాని
పగిదినటునిటు చూచెదు • పాండుతనయ॥

రాజా! వనజవైరిని దిరస్కరించు వదనంబు వాడుటకును పదహారవవన్నె బంగారమువలె పొదలుచుండెడి సతమలదేహంబు నల్లబారి స్వేదంబుతో గూడుటకును గారణంబేమి? అకటకటా-

సీ॥ రాజునై జన్మించి • రమ్యంబుగా నేల
భూమిలేదని చింత • బూనినావ।

రాజకుల విభూషణా! ఘోరవైరుల దునుమాడి యుల్లోకంబుల పేరుగాంచిన వీరుండవే- యిట్టి నీరసపుకార్యంబున కీతీరునఁ దిగులొందనేల? చాలుచాలు. నీమనంబునఁగల కోర్కెను దీర్చుటకు భారంబునాది. గాన, పురంబున కేగి ఖేదంబువిడచి సౌధంబున హంసతూలికా తల్పంబున శయనించుము. పోదమురమ్ము

(అని నిష్క్రమించుచున్నారు)





# ఉలూచీపరిణయ నాటకము.

## ద్వితీయాంకము

అజ—(నిద్రనభినయించి) హాకాంత! హాకాంత! (అని అటునిటు జూచును) ఔరారా! ఆత్రేయజాక్షి! యిప్పుడు నాచేయి పట్టుకులాగి మరల నెటు పోయెనోగదా ఆహా! యేమి యాశ్చర్యము. కాదుకాదు నన్ను వెరపించవలెనని యేమరుగునో డాగియుండవచ్చును-

(తెరలో)

బ్రాహ్మ—ఒరే ఓగ్రే,దౌర్భాగ్యులార! హాోమధేనువురో, హాోమధేనువురో, మీకు దండమైన పెడుతాను యివ్వండి సుమా!యివ్వండిసుమా బ్రాహ్మణసొమ్ము నపహరిస్తే చస్తారు దౌర్భాగ్యులారా! (అని జంధ్యాలు పెరుక్కొ బోవును.)

సీ॥ హాదైవమాయింత • యర్ధరాత్రంబున
నన్ను రక్షించెడి • నాధుడెవడు!

మాఱ్లాడకుండిన◆మఖ గూర్పు లేకట్టి
యజ్ఞంబుసాగ బో◆వకటకర్మ।
కువలయంబున నృప◆శేఖరులన్నింటిలో
నాయావెదొంకవ◆ల్లా ముకుంద।
యెచ్చటిదౌర్భాగ్య◆మ్రుచ్చుగో యేతెంచి
నాకొంపతీసిరి◆లోకవేద్య।

గీ॥ యేమిచేయుదునయ్య శ్రీ◆రామరామ।
నన్ను జంపుకుపోయినా◆యిన్నిపాట్లు
లేకపోనేమి చేయు దీ◆రేయివేళ
నీవెదిక్కయననుబ్రోవ◆దేవవినుత॥

అర్జ—(తనలో) ఆహా! యీరాత్రివేళ విప్రుండెవఁడో విలపించుచున్నవాఁడు యీరోదన నాకర్ణంబుఁబడి యూరకుండుట క్షత్రియధర్మంబుగాదు- (ప్రకాశముగా) అరే దౌవ్వారికా! యీరోదనంబు జేసెడి భూదేవుని నాసముఖంబునకుఁ దోడ్కొని రమ్ము.

దౌవా—రాజా! మహాప్రసాదము.

(నిష్క్రమించుచున్నాడు)

---

దౌవా—ఓ భూసురోత్తమా! (అని పిలచును)

బ్రాహ్మ—యెవరువారు యెవరువారు? (అని ముఖమువీఁద చేసులుంచుకొనును)

దా వా—యెవ్వరైతే నేమికాని విప్రవర్యా! ధనంజ యుండు మిమ్ముల క్షిప్రగతిందోడ్కొని రమ్మని యానతి చ్చెగాన రమ్ము పోవుదము.

బ్రాహ్మ—అర్జనుడే రమ్మంటే నేనదృష్ట వంతు డనే నడు నాయనా. (నిష్క్రమించుచున్నారు)

అర్జ— (లేచి) భూదేవుడా ! నీవు రోదనంబుచే యుటకు కారణంబేమో వక్కాణింపుము?

బ్రాహ్మ—వాసవీ!దోసకారులగు చోరులు నాకపి తుధేనువును ముచ్చిలి దీసుకొనిపోవుచున్న నే జూచి యనే కవిధంబులప్రార్థన జేసినప్పటికీ విడువకే తెంచుచున్నవా రు గాన నామనవి విని వేగచని వారలఖూరిగొని నాయావు నునాకొసంగుము. అర్జనా! జితదుర్జనా! (అనియేడ్చును)

అర్జ—ద్విజవర్యా! వెరవకుండు నీధేనువును తెచ్చి యిచ్చెద (అని నిష్క్రమించుచున్నాడు)

చోరు—(తనలో) అరే! పవమానవేగంబున బా ధిరవేంద్రుడెవడో మనల బట్టనుద్యుక్తుండైవచ్చుచున్నాడు. నీవు జరావస్థచేపరుగిడజాలవు గాన యీ ఖరవీరచెట్లలో డాగుము(అని తనలో)దైవమా!వీనిని జూడ రణశూరునివలె గాన్పించుచుండె నైనను బారిపోవుట పనిగాదు. కొంచము పరాక్రమంబు జూపెద.

అర్జు—

శా॥ ఏరా యెవ్వడ వింత రాత్రి నిభయంబై పాటిపాటింపకన్।
ఘోరున్ విప్రుని హోమధేనువును గొంపోయ్యేవు చీదుర్మతీ
వీరుండర్జునుడంచు బల్కుపలుకుల్ విన్నావొ లేదో కదా
నారాచమ్ములపాలు గాక మొదవు న్నాకిచ్చిపోపొమ్మురా॥

అర్జు—(యెదటకువచ్చి)

జంజూటి— ఆది— తాళం

నిలు నిలు నిలు పారిపోక। నీచవర్తనా।
నీచవర్తనా। నీచవర్తనా॥ని॥
చలమున బదునగు। ములుకుల చేని।
న్నిలబడ పైచెద। నిచ్చటనీ।
తులువ పనులు। సాగవునా। బలము సూడు। ఖలుడ నిలచి॥ని

చోరు—

పారిపోను రార నీదు। పౌరుష మేమో।
పౌరుష మేమో। పౌరుష మేమో। ॥పా॥
ధీరుని బగిదియు। సారెసారెకును।
గారులు పేల్చెలక। చేరుముని।
బీరమెంతో జూడక నే। బారిపోను రార కూర॥పా॥

అర్జు—

జడుపేమియు లేక నిట్టి నడురాతిరిని।
బ్బుడమిదేవులను। ఖుడుములు వెట్టుట।

నడవడిగాదని। దడయకను।
గడగిజోము తొడుకుబట్టి। వడిగాపరుగిడుదువా॥ని॥

చోరు—
పరుగిడకుండానన్నిట। పట్టుకుందువా
కరమునగల। యీ ఖడ్గముచేయవే।
పురకంపియు నేబోయెదరా। తెరవుబట్టి
నుగునాతో। దురముసేయ। భరమురా॥పా॥

అర్జు—
మనమణంతునీకీతిని। వదరుచుంటివా।
కదనముధందున। యెదిరిచినాతో।
బెదరక నిలచిన। బీరముగా।
మునముతోడ। పదును శరము। నెదనాటించి। తిదుగొనూడు॥ని॥

చోరు—
పారమైనవాడనై తే। రారవేగమె।
చోరులయెదుటకు। చొరబడివచ్చితే।
కాలునిబురి బహు చేరువురా।
పాపోర। పోర లేవు। చేరుపురము శీఘ్రమే॥పా॥

అర్జు—అరేమరాత్మ! ధేనువునువిడచి నీప్రాణంబు సుగా మకొనిబొమ్ము- లేనిచో నీమరణంబునిశ్చయమని నమ్ము

చోరు—రాజకులాధమా! వట్టిమాటల ప్రయోజనంబేమి? నన్నునీవును నిన్ను నేనును బట్టుకొనిన వాగుట్టు గ

ట్టిగా తెలసును గాన శూరుడవైన రారాచూతము—

అజ—ధృవకోకిలవృత్తం

సురలుగిన్నెరగుహ్యకాసుర, సూరులైననుబోరగా।
తరముగాకను బారిపోయిరి, దాచుకోతవపాణిముల్॥

చోరు—ధృవకోకిల వృత్తము

యిటుల మాటలుసెప్పినందున, యేమిలాభముగల్గునీ।
పటిమచూపిన మెచ్చినేసల, పారునావునోసంగెదన్॥

అజ—

స్థిరము నేటిదినంబునందొక, తీవ్రఖడ్గము చేతనిక్।
పగ శేష్పుత్రిపురంబు జేర్చెద, ధైర్యమీడకనిల్వరా॥

చోరు—

దిటముబూని మనంబునిష్టపు, దేవతాళిని వేడుకో।
కటికిచీకటివేళనిన్నిట, కత్తికిచ్చలియిచ్చెదన్॥

అజ—పంచచామర

ఒరేయి రేయటంచు నిట్టు, లోకకృతిపేరిలెదా।
దురాత్మజాలిబూనియింత, దూరమూరకుంటిరా।
ధరాతలంబునన్ శిరంబు, ధైర్యమొప్పద్రుంచెదన్।
బరాకులేక కాసుకోర, బాణమిచ్చుకూరుడా॥

చోరు—పంచచామర

పరాకులేదుగాని వట్టి, పౌరుషానికేమిలే।
నిరంతరంబు దొంగవృత్తి, నేర్పుగల్గియుండినే।

పరాజితారి వీరుడంచు॰పాటి కెక్కినాడనీ।
పురంబుతోవ్రి పట్టివేగ॰పోరచావ నేటికిన్॥

అర్జు—దురాత్మా! నిన్ను దృంచక విడుచుటే దోషంబుగాన చరాలున నీశిరంబు ధరణికింగూలనేసెద చూడుము (అని జుట్టుపట్టుకొని)

సుగంధివృత్తము—

వేరువకిటుల పేలుచున్న॰విడతు నాదురాత్మనీ।
తరముగాదు నన్ను గెల్వ॰దర్పముడిగినిల్వనా।
కరమునున్న ఖడ్గమునను॰గ్రక్కునన్ ధరాస్థలిన్।
శిరమువ్రాలి పడగద్రుంతు॰సిద్ధమిదుగో చూడరా॥

అర్జు—(కత్తి విసరును) చోరు—(భూమినిబడి చచ్చును)

అర్జు—భూసురోత్తమా! ధేనువునిగొని మీస్థానంబునకు వేంచేయుడు.

బ్రాహ్మ—అర్జున! నీ కటాక్షంబువలన నీయావు నా గన్నులకగుపడుట ప్రాప్తించెగాన మీకు శుభమయ్యెడు నేబోయివచ్చెద- (అని నిష్క్రమించుచున్నాడు)

అర్జు—(స్మృతినధీనయించి తనలో) కటకటా! యెంతమూర్ఖుడనైతిని యికనైన యూరకుండుట తీరగాదుగాన నాయగ్రజుండగు ధర్మరాజు సన్నిధికేతెంచి శరణుజొచ్చెద- (అని నిష్క్రమించుచున్నాడు)

గంగమ్మ— ధర్మరాజు సభ.

(ధర్మరాజును మంత్రియును ప్రవేశించుచున్నారు)

ధర్మ—మంత్రీ! మన రాజ్యంబున బుడమిదేవులు స్నానసంధ్యాజప తప హోమ వేద పారాయణ కృత్యంబులు సల్పుచుం నిష్ఠాగరిష్ఠులై సుఖంబున నున్నవార లేకదా? రాజులు సత్యంబేమరక సామ దాన భేద దండంబుల నెడి చతురోపాయంబులు నెగ్గి యాగంబులు సేయుచూ విప్రులకు త్యాగంబులొసంగుచు భద్రంబున నున్నవారలేకదా? కిరాటులు కులాచారంబులగు వ్యవసాయ వ్యవహార గోరక్షణాది కృత్యంబులందడకువగల్గి కిన్నరేశున కన్న మిన్న ధనంబార్జించి సుఖంబున నున్నవారలేకదా? పాదోద్భవులు బ్రాహ్మణాద్యగ్రజాతుల దెస భక్తిశ్రద్ధలుగల్గి సుఖంబున మెలంగుచున్నవారలేకదా?

మంత్రి—రాజశేఖరా! భవదాజ్ఞానువర్తులై సుఖంబుగానున్నవారలు.

(అర్జునుడు ప్రవేశించుచున్నాడు.)

అర్జు—ధర్మజా! నమస్కారము (అని చేతులుజోడించును.)

ధర్మ—అనుజా! సుఖీభవ! సుఖీభవ (అని కౌగలించుకొనును)

అర్జు—అగ్రజా! పాపుడొకడు తన గ్రీతుధేనువు

ను దోరులు గొనిపోవుచున్నారని విలపించుచుండ నేనొక నేరము నర్చితినన్నయా చిన్నతనపు చేష్టలు మన్నింపుము

ధర్మ—అనుజా! నీవంత కినుక జెందనేల? అటులనే మన్నించెద వక్కాణింపుము.

అర్జు—ధర్మజా! మీరు పాంచాలితోనున్న సమయంబున మన యాయుధాగారంబునకువచ్చి ధనుర్బాణంబులు దెచ్చి యా తెక్కలికానివధించి గోవునుదెచ్చి భూసురునికిచ్చితి గాన మున్ను మనలో నొకరితో నొక సంవత్సరము దాపదియుండుట మంచిదనిన్ని మనలో నొకరితోనున్న తరి నొకరు వెళ్లి రేని ద్వాదశ మాసంబులు దీర్ఘయాత్ర చేయవలెననిన్ని నారదునిమోల నొడంబడితిమి గాన నా తప్పు క్షమించి తీర్థయాత్రకు సెలవొసంగుము.

ధర్మ—వాసవీ! నీవు చేసినగార్యంబు భూసురప్రీతికరంబుగాన లేశమైనను దోసంబు లేదు. వెరువనేటికి?

గీ॥ దేవఋషిమోల మనమట్లు దెల్పుకున్న।
నీవు చేసినగార్యంబు నెగ్గు లేదు।
క్రూరులనుద్రుంచి విప్రుల నేలుతరిని।
స్వల్పదోషంబు లెన్నంగ జనవుసుమ్మి॥

అదియునుంగాక.

గీ॥ బాలురను గోగణంబుల భామినులను
వృద్ధలను బ్రాహ్మణులనొక బుద్ధి లేని।

ద్రోహుఁడవడైన బాధల్ఁ ద్రోచుతరిని।
ధర్మమిడచియు సత్యంబుఁదప్పిమైన।
రక్షణంబు నొనర్చుటఁ రాజనీతి॥

అర్జు—మహాత్మా! మైనను మహాఋషులమ్రో ల బలికినరీతి మెలగకుండుట భావ్యంబుగాదు. గాన నన్ను గటాక్షించి సెలవొసంగుము-

ధర్మ—అనుజా! యటులైన వెళ్లి భద్రింబున రమ్ము

అర్జు—అగ్రజా! పోయివచ్చెద-

ధర్మ—శుభమయ్యెడు

అర్జు—(నిష్క్రమించుచున్నాడు)

విశా— (ప్రవేశించుచున్నాడు) (తనలో) అహా! యీకవ్వడి యెవ్వరూ వెంటలేకుండగ నొంటిగాయాత్రకు బోవుచున్నాడు నే వెళ్లకున్న యాపదల పొందగలడుగాన పోయివచ్చెద (అని అర్జునుని సమీపించి)

విశా—విజయరాధిపనందనా! నిన్నొక్క నిముషమైనను విడువజాలని నన్ను విడచిపోవుట మీకుచితంబేగదా?

అర్జు—మిత్రరత్నమా! యీమాటలమధ్య మరచితిగాన పోయివచ్చెదమురమ్ము (అని నిష్క్రమించుచు న్నారు,)

రంగము-పుణ్యస్థలములు.

విశా—

గీ॥ చూడు మాదేవళంబులఁసొగసునహహా।

ఖచితనవరత్నములచేత • గ్రాలుచుండె।
గోపురంబులువిన్నందు • కొన్న వనుచు।
మదిదలంతురుజూచిన • మనుజులెల్ల॥

అర్జు — ఆహా విశారదా! యీ దేవళంబుల శోభ లంబరయ నా దేహంబు పరవశత్వంబు నొందుచుండెగదా యేమిచిత్రము!

సీ॥ ఆసాలములుప్రాయి • యభ్రమండలమంట।
మేముమాత్రము వెళ్ల • లేమయనుచు।
నాదేవళంబులు • నభ్రమండలమంట
మేముమాత్రము వెళ్ల • లేమయనుచు।
నాధ్వజస్తంభంబు • లర్కమండలమంట
మేముమాత్రము వెళ్ల • లేమయనుచు।
నాగోపురంబులు • వేగమేనక్షత్ర
మండలంబాగినంటె • యుండెననగ।

గీ॥ బాదలుచున్నవి యెటువంటె • భూరిపాప
సంఘమయినను బాయుని • స్సంశయముగ
మేలుభళమయబ్రహ్మని • ర్మింపబోలు
గాక నీసుందరం బెట్లు • గల్గుమిత్ర॥

విశా — రాజా! చిత్రము చిత్రము. అటులనే దోచుచున్నవి గాని

సీ॥ కాళేశ్వరంబున • యాలయంబులఁజొచ్చి
కరకంఠుఁబూజించి • పరమభక్తి।
దరువాతఁగంచనే • బుగవరంబరుదెంచి
వరదరాజులపాద • వనజయుగము।
నతిభక్తి నర్చించి • యాపురంబిడనాడి
తిరుపతి వెంకటే • శ్వరులఁగొల్చి।
శ్రీశైలయీశుని • సేవించికడువేడ్క
కాశీనివాసువి • శ్వేశుఁజూచి।

గీ॥ శ్వేతవాహనఘనయాత్ర • చేసి మిగుల।
నలచటనుబొందియుంటిమి • జలజనేత్రి
శీఘ్రమేబోయి నిష్క్రమ • జేరిదరిని
విశ్రమింతము పదవయ్య • విజయవేగ॥

అజ—అవునౌను జాలా శ్రమగానున్నది. అటులనే బోవుదము.

(అని నిష్క్రమించుచున్నారు.)

యిది విష్కంభము.



# ఉలూచీపరిణయ నాటకము.

## తృతీయాంకము.

రంగము—నాగలోకము (ఉలూచి ప్రవేసించుచున్నది.)

ఉలూచి—(తనలో) యింద్రతనయుని సుందరం బందరును జెప్పుకొనుచుండ విన నా డెందంబున మరుపుగాకయుండి కందర్పబాధ హెచ్చ నా యగ్రచెలికత్తెయగు చంద్రరేఖను యోగిని వేషంబునబంపితి నింకనూ రాకుండెగదా? దైవమా! నేనేమిసేయుదానను యీ విరహాగ్నినెట్లు నిర్వహింతు(అని విరహతాప మభినయించుచున్నది.)

(మీనాక్షి, సుగుణవతి ప్రవేసించుచున్నారు.)

మీనా—

క॥ యింతీనీవీతీరున।
జింతింపగనేల మేము॥ చెంతనుగలుగ
న్నెంతటికార్యంబైనను।
గాంతాతీర్పంగగలము॥ గ్రక్కున జెపుమా॥

కోమలీ! కాముని మామను క్రిందుచేయు నీమోము కళ నసించుటకును గుందనంబుకంటె సుందరంబగు నీమేను గ్రిందుటకును జక్కగా యక్కడగల సోయగం బక్కడగల యవయవంబులు స్రుక్కుటకును 'గతంబెద్దే తల్లీ-

సుగుణవతి—

సీ॥ తలిరుబోణిరో బగ్గి • శతులకుముద మొప్ప
గొనుకున నాట్యంబు • గరపవేమి।
సారసనేత్రిరో • కీరంబులనుజేరి
యింపుగా బల్కింప • వెందుచేత।
నబ్జాక్షిరో పెంపు • డంచలరమ్మని
జెలువొప్పనడకలు • సెప్పనేమి।
గోరువంకలమూక • చేరువనుంచుకు
నతివవేడుకమాటలాడవేమి।
గీ॥ యెన్నివిధములపిలచిన • నన్నిలాడి॥
బల్కకుంటివి యిదియేమి • పాపమమ్మ
నీకు వందనమొనరింతు • నిజమునాతో
నున్నదున్నట్లు చెప్పవే • సన్నుతాంగి॥

అయ్యయ్యో! మగువా మనమిద్దారుకోనుట మంచి నాదీ యించుబోడి కేదో సంభవించియున్నది యేవిధంబునైనా యాబాధ తొలగించ నాలోచింతమురావే కొమ్మా!

మీనా—అంగనా! రంగుచెలంగు బంగరుభూషణంబులు ధరించక పనజంబును వంచనచేయు వదనంబున కస్తూరిబెట్టక పరిమళయుక్తంబులగు ప్రసూనంబులు గచమునధరియించక దరిలేని దుఃఖాబ్ధిని మునుగుచూ దేలుచూ దిరుగాడుచుంటి విది యేమికర్మమే?

సుగు —

గీ॥ యింపులకుఁగతమెద్దిరో, మందయాన!
దొందరగ తెల్పకుంటివా, తోడఁకుచేటు
జలజనేత్రి! రోదానికి, వలనుపడిన
గార్యమూహించగావలె, కాంత చెపుము॥

పులా— (పయ్యెదతో కన్నీరొత్తుకొనుచూ) మొల్ల సుగంధులారా! నన్నల్లరిపెట్టక నాయుల్లంబునగల కోర్కె దీర్చెదమని కల్లవిడచి బాసలుసేసిన మెల్లగా చెప్పెద—

సుగు—అమ్మా! పులాంచీ! అటులనే దీర్చెదము. వక్కాణించవే.

ఉలూ—కొమ్మా! యటులైన నిశ్చలచిత్తంబున వినుము-

ఉ॥ కవ్వడి పైని నామనము, గల్గుటచూచి దురాత్ముడైన యా
పువ్వుశరుండు క్రోధమున, బొంగుచు వాడిశరంబు చేత న
న్నొవ్వగ నేసిపోయెనహా, నూరుజొహారులు సేతు శీఘ్రమె
యొప్పఘనైనవానిగొని, యిచ్చిన బ్రాణమునిల్చు జొప్రుడే

కరవాణులారా! యామారునిదెస నేజేసిన నేరములేమి? ఘనుతైన విజయాదిపురుషులతో పోరొనర్చి వీరము చూపిన వీరుడనుపించుకొనునుగాని నావంటి నారీమణులనీ రీతి ఘోరబాధలదోచిన శూరుడందురా క్రూరుడంమను గాని? ఓ కారర!

ఉ॥ అక్కరొ వానిగౌగిటను హాయిగ జేర్చుకు మోవివేడుక
న్జొక్కరసంబు గ్రోలుటమ్మనో హరమై హెరగూడియుండుట।
జ్ఞొక్కిలి ముద్దుబెట్టుకొన జేకురు చేడియభాగ్యమెన్నగా।
నిక్కపులోక వాసుడును నేరడు నాకు లభించునా చెలీ॥

యిందుముఖులారా! అందనిబండ్ల కాసించుగతి యింద్రతనయుని పొందుగోరియుంటి నెట్లుచేకూడు? నాయందు కూరిమిచే నా వారిజాక్షుని నేరుపుగలను మనుల జేరదీసుకురాగల శక్తిమంతులెవ్వరు అబ్బా! యీవిరహవేదనెట్లు సహింతు? నాపొందుకత్తెలలో పెద్దదగు చంద్రరేఖయున్నను లెస్సగా నుండుగదా! దైవమా!

ఫీల్సూ — ఆట.

1　యేమిాతోచకుండే। నామానాసంబూన।
　　భామాకోయికనే। యూపాయంబుగలదూ ॥యే॥

2　కామూమూకరీనూస్తై। తామా రాసాస్త్రములా।
　　నామిాదనూ రాకే నడుపూచున్నాడు॥యే॥

3　అన్నన్నాబొగాలుచూ। నున్నాదిదేహామిా।
　　వెన్నెలాలోనిలచి। యున్నామాత్రమునా॥

ఉ॥ అక్కట యెంతపుణ్యులొక దానరభామినులా ధనంజయు
న్మక్కువతీరనిచ్చలును మన్మథకేళిడలు చేలియాడనా
దెక్కడు భాగ్యమైనభువి నింపుగ మర్త్యులలామనాదుసీ
తక్కువసర్పవంశమున దైవము యెందుకు పుట్టుదయుంరొ॥

గాకున్నను సన్యాసికి మానకమ్మ సంభవించుగాని భాగ్యహీనులకు యోగ్యపురుషులు లభింతురా (అని మోర్ఛపడును)

(చంద్రరేఖ ప్రవేసించుచున్నది)

చంద్రి—(వులూచినిజూచి నోరు అయ్యోఅని కొట్టుకొనును)

అమ్మలారా! మనరాణి సొమ్ములుంచుకొనక జీవింప సమ్మతిలేనిదానివలె నానా వికారమ్ముల సొమ్మసిలుండుటకు కారణంబేమి? (అని లేవనెత్తును.)

సుగు—అక్కా! నీవు చనినవాసరంబుమొదలీ భాసురాంగి వాసవిపైమదినిల్పి నిదురహారంబుల నాశలేక మేము పిలచిననూ బలుకక చంద్రరేఖా చంద్రరేఖాయని ఘడియకొక వందమారులు దపించుచుండె.యిందుకుపాయంబెద్దియో యోచింపుడు-

చంద్రి—కలికీ! ఉలూచీ! నన్నుబంపియూ నిట్లు విచారింప కారణంబేమో? చెప్పు గల్లీ!

ఉలూ—(నేత్రంబులు విప్పి పయ్యెదనొత్తుచు) చెలీ! చంద్రరేఖా! నన్నిచ్చట విరహబాధకు దోచి యెచ్చటకే తెంచితివి? నాయిచ్ఛనుదీర్చి రక్షించువారెవ్వరే-(అని కౌగలించుకొని)

సీ॥ అతివరోవాసవి యాశ్రిడవాసంబు
గల్గునా యెపుడైన గాంతనాకు।
మోవినొక్కరసంబు ద్రావెడిభాగ్యంబు
గల్గునా యెపుడైన గాంతనాకు।
కోర్కెదీరగ వాని కురువున గూర్చుండ
గల్గునా యెపుడైన గాంతనాకు।
మక్కువతోనొక్క పక్కను శయనించ
గల్గునా యెపుడైన గాంతనాకు।
గీ॥ ముదముతోడుత వానితో ముచ్చటించు।
భాగ్యమెపుడైన గల్గునా భామనాకు
నకటమారుని కేళిలో హాయిగాను
బాదలుచుండెడి సంపద బొందగలనె॥

చంద్రరేఖా! యిందునినిందించు వదనంబు కందర్పుని క్రిందుచేయగల సుందరంబు దేవపాదపశాఖల వెగడు బాహువులును శరజన్ముని నిరసించు శక్తియు మేరువుకంటె మిక్కటంబగు ధీరత్వంబును పరశురాముని దిరస్కరించు శరలాఘవంబునుగల్గి యింద్రనందనుం డిరవొందుచుండెనని వింటి వానిబొందు లభించకున్న నెందుకు జీవించుట.

గీ॥ కన్నుమూసిన గలలోన గానబడుచు
నుండెనేచెలి యెంత నియుందునిల్లు
విరహమగ్గలమాయెను వెలదియకట
తాళజాలను నన్నేల తరియిదేనె॥

అక్కా! పార్థుడు హంసతూలికా తల్పమందున్న సమయమందు తొలకరిమెరుపువలె తళతళ మెరయుచూ వానికెలనుండి తమాలపత్రంబుల చిలుకల జట్టిచ్చుచూ గాథలు చెప్పుకొనుచు కిలకిల నవ్వుకొనుచుండుట ప్రాప్తించు. మాకిలిమినెంచ పలుకువెలదుక మగనితరమా! భారతితరమా! అరేయునే! యంతనై భవంబునావంటి యదృష్టహీనురాలికా? కాదు కాదు. యెన్నినోములునోచిన గన్నియ యిట్టి మున్న వైభవంబు బడయుట! అయినను కొమ్మా! నిను నమ్ముకొనియుంటి పిదప నీసమ్మతి వచ్చినట్టుల జేయుము.

చంద్రి—కిలికీ! ముచ్చ చిలకరో తుస ములుకులబాధచే గుందుచున్న నాజలజనేత్రి దోడి తెమ్మని సెలవొసంగి నవిచ్చేసితి నిపుడు వచ్చుట కేగినెనని బల్కెడవేమ మత్స్యక...

ఉలూ—అదివా! నామనివమాలినమాటలకేమిగాని నంతుకంబుగావినంతి కుంతీసుతు చెంతకుబు విన్నవించుము—

చంద్రి—ఉలూచీ! మునివేషంబుచే నాథునులున్న చోటునకు చనుదెంచి నిను చాలా వర్ణించ నతండు విని మనము నీపై మగ్నంబై తన హితులగూడి పురంబునకు చనుదెంచె. పదప విగినతంబు నధిక యాత్రలు సల్పుచూ గంగా...

సీ॥ నీరజాక్షి రో నీకు నిజముగా దెల్పెద
విజయుచరిత్రంబు వేడుకలర।
ఘనపాపహారియౌ గంగానదీతీర
మున సైకతస్థలం బునను వేట్క।
నతిపావనంపుద ర్భాసనంబులనిడి
కోమరొప్పనిరుపురు కూరుచుండి।
సద్విద్యనింద్రియ సంఘుంబు హరికట్టి
కడుభక్తి మోక్షమా ర్గంబు పట్టి।
గీ॥ యక్షులనుమూసి భ్రూమధ్య మందుదృష్టి।
నొప్పుగానుంచి ముఖముల నూర్ధ్వమునకు
బెట్టి ఖేచరీముద్రిను బట్టియుండ
జూచివచ్చితినే కొమ్మ పొంపుమీర॥

ఆహా! యిందురేఖా! సంతోషము. వాని సుందరం బెట్టిదో కొంచము విన్నవించి నాడెందం బానందం బొందించుము-

చంద్రి—తల్లీ! వక్కాణించెద శ్రవణానందముగా నాకర్ణింపుము.

సీ॥ నారీమణిరో కీ్రిడి సూరత లెన్నగా
నతివరో యొకమాస మాగదమ్మ।
యిలయందునాతని బలమునువర్ణింప
[illegible]

కువలయాక్షిరో వాని గుణములనెన్నగా
పడతిరో వర్షంబు బట్టునమ్మ!
కుందయానరో వాని సుందరంబెన్నగా
వన్నన్నరెయోకయుగంబు గాగదమ్మ!

గీ॥ తరుణిరో వేగిరించిన కరుణమందు
చెప్పుటకు నెంతభారమో చెలియగనుము
ధాతభారతి శేషుల తరముగాదు
పొలతిరో నాకు శక్యమా పొగడనరుని॥

చ॥ కలువలమీరుకన్నులును గాముని గేరెడు సోయగం
బహా! జలజవిరోధి మోముమరు చాపముచూడగ
భూయుగంబు శ్రీ! వలముగి గేలి చేయునల వాపవి
గ్రీవము మంజువాణినా! కలవియె వాని సుందరము
నక్కట దెల్పగజాలనే చెలీ॥

యిందుముఖి! యామందరగిరిధరు పొందుకాని సుం
దరంబెన్న నావంటి మందబుద్ధులకు తరమా కొమ్మా!

సుగు—యికనైనా ఖేదంబు విడచి మోదంబు నొం
దుమమ్మా-

ఉలూ—ఆహా! నెచ్చెలులారా! మారుని క్రూరనా
రాచంబులచే జీరబడిన యెద కలదాననై ఘోర బాధను
గుందుచూ నీరీతినున్న దానను మీరిట్లు వేరు శేయబోకుడి
నూరు నమస్కారంబులు చేసెద నూరకుండుడి చెలులారా!

సుగు—అయ్యో! యిదేమిచిత్రమే పిల్లితోక యెద్దుతొక్కితే యెలుకమీద పళ్లకొరికినట్లు మామీద కండ్లెరజేసెదవు. చాలుచాలు (అని మాటతిప్పును)

ఉలూ—

గీ॥ పాణితో నాకుగల్గిన బాధనేమి।
చూడకయె కోపగించంగఁ జేడిలార
తగదనుచు మీమనంబులఁ దలచరకట
దైవమాయెట్లు తాళుదీ తాపమునకు॥

(అని తలకొట్టుకొనును)

చంద్ర—సుందరాంగీ! నీవిట్లు గుందనేల? నీడెందంబు నంగల నందియుంబుదీర్చెద యూరకుండుము. (అని కండ్లు తుడుచును)

ఉలూ—చంద్రరేఖా! నాపొందుకత్తెలందరిలో నాయందు ప్రేమకలదానవు నీవె తల్లీ. సంతోషము—

చంద్ర—తల్లీ! నీ వల్లరిచేయక నీయంతఃపురమున మెల్లగా యుండుము. మేము మా గృహకృత్యంబుల కేగి యిప్పుడే వచ్చెదము రమ్మ బోవుదము.

(అని చేతులుబట్టుకొని అందరూ నిష్క్రమించుచున్నారు.)



# ఉలూచీపరిణయ నాటకము.



## చతుర్థాంకము.

ఉలూ—(నిద్రాభినయించి) హా వాసవీ! హా వాసవీ! (యని లేచును)

(తనలో) ఔరా! యీవన్నెకాడు నాకన్నులగిగుప డియు నన్నువిడనాడిపోయె కోపగించెనాయేమి? కాదుకాదు! నన్ను కంగారుపెట్ట నిన్ని చిన్నెలొనర్చుచూ యేచాటునో డాగియున్నవాడు కాబోలును (అని చూచును)

గీ॥ యెన్నివిధములచింతించు•చున్ననేమి।
కార్యమున్నది నను బీ్రతి•గావనెవరు
గాననిమ్మగదరినింద్ర•సూనుడన్న
సన్నదెల్పెనునాకల•చంద్రరేఖ॥

కావున యాతోవ్రబట్టుకు చని యీ మహానుభావు ని కండ్లజూచెద- (అని నిష్క్రమించు చున్నది.)

## రంగము—వనము.

ఔరా! యేలవచ్చితి? వెరవులేకయున్నను వెరవుగా న్పించకుండె నేమిచేయుదాన—

కం॥ ఓకాంతుడ నీకై చని
?కటిలో త్రోవదప్పి•చిక్కులు పడినే

కంతునిచెంతజేరి సంతోషంబునఁ సంతతంబును వింతగా కై వారంబులుసల్పు గోరువంకల గగారమై అంబరంబునకెగసి రంభలవలె నాట్యంబులు సల్పుచూ కుంభినిగల జనంబులకు హర్షంబుగల్గజేయు మయూరంబుల కుని కిపట్టై వసంతుని మంతనంబుచే గర్వించి పాంథులైన గాంతల సంతలువెట్టి చింతాసాగరంబున ద్రోయు కంతుని కెంతయూ వాసంబైన యీ కాంతారంబున కేలవచ్చితి అయ్యో! నా ముఖము తిరుగుచున్నది- (అని క్రింద మూర్ఛపడును)

రంగము— ఉలూచి అంతఃపురము.

(సుగుణవతి ప్రవేసించుచున్నది.) (అటూ యిటూ చూచి)

యీమేడలో యెక్కడచూచినను జేడియ కనుపించకున్నది. యిది చూడ నేదోయొక చేటొదవియుండ వచ్చును. అయినను చంద్రరేఖతో విన్నవించెద (చంద్రరేఖా! యని బిలచును.)

చంద్ర—యేమే చెలియలా! (అని వచ్చును.)

సుగు—అక్కా! వింటివటే. అయ్యయో! మన కొక్క చేటొదవె. మనరాణి యెక్కడజూచినను గాన్పించక నొక్కతే యెక్కడ కేతెంచెనో తెలియకున్నది-

చంద్ర—సుగుణవతీ! నిజమేనటమ్మా?

సుగు—నిజమేనమ్మ. నాబొట్టు తో డేసరి.

చంద్రి—అమ్మా! యింతటి రాగ యింత రాత్రివేళ వొంటరిని బోవుటకు తన స్వాంతం బెట్లొప్పెనే? ఆహాహా! (అని గడ్డము పట్టుకొనును.) చెలియలా! యిట్లూరకొను టు పాయంబు గాదు. గాన శీఘ్రంబుగా చని మన చెలికత్తెం దోడ్కొని రమ్ము-

సుగు—అటులనే బోయెద (అని బోవుచున్నది.)

చంద్రి—గీ॥ యెంత సాహసివే చెలి, యింత రాత్రి
వేళ నెట్లేగుదెంచితి, వెరపు లేక
రాయకన్నను గతినమో, రామ నీదు
మనము నూహించ నాహాహ, మాపమ్మ యేమొ!

సుగు—కలికీ! నీ శెలవుప్రకార మీనెచెలులం దోడ్తెచ్చితి

చంద్రి—సఖీ! మన రాణి జత లేక చనుదెంచుట వింటిరటే!

మీనా—నిక్క మేనటమ్మా? (అని గడ్డము పట్టుకొనును.)

చంద్రి—నిజ మేనమ్మా.

మీనా—గీ॥ యేమి యాశ్చర్య మమ్మ, యెవ్వారి మనసు నేర్చి
జంట లేకున్న బయటికి, వసగ లేని
గాంత కిటువంటి ధైర్యంబు, గల్గుటరయ
నేమి కోచ బెటున్నదో, స్వాను కరుణ॥

చంద్రి—అమ్మలారా! మెత్తె జజ్జను బన్నుండుట వీక్షించి యే కూర్పురుష్టైనా యెత్తుకుపోయెనా లేక నేనెన్ని విధంబుల ప్రార్థించినను-చెలికత్తులా వన్నె కాని దెచ్చి యి

న్వేక పోయిగని మనపై కోపించి యేదైన నొక కూపంబున దుమికెనా యేమి తెలియకున్నదమ్మా?

మీనా—అక్కా! కాదు కాదు! తప్పకుండా యేపురుషునో తగులుకు పోయినది-

సుగు—చాలు చాలు! తగులుకుపోదమన్నను యింతరాత్రివేళ అతాత్తుగా మొగులెక్కడ వత్తురమ్మా? నీ మాటలెంతో పచ్చికలి-

చంద్రి—చెలియలారా! కనీ వినక మనము ఫలానని నిశ్చయించుట పాతకంబు గానట్లనబో కెక్లే గనో యోచింపుడు.

సుగు—అందరిలో పెద్దవు కుశల బుద్ధివి నీవే యోచింపుము-

చంద్రి—నారులారా! కిరీతమా నీరజాక్షితో ధనంజయుండు గంగానది తీరంబున నివసించి యుండెనని వక్కాణించిత గాన నచ్చటికే విచ్చేసియుండవచ్చునని నామనంబున బాడముచున్నయది. గాన శీఘ్రం బే తెంగతమురండు-(అని నిష్క్రమించుచున్నారు.)

రంగము— వనము.

చంద్రి—సీ॥ పొలతియాతోరివను॰బోయినట్లున్న దే।
తూలుచు నిడుపాద॰జాలమిదుగా॥
సుగు—నాతి యీమార్గాన॰నడచినట్లున్న దే।
జీలాడు కుచ్చెళ్ళ॰పోలికిదిగా॥

మీనా — వెలది యీ నరశినివెళ్లినట్లున్న దే।
విరులనునులువమాడి విసరెనివిగో!!

చంద్రి — చానయీ తెరవున చనినట్టులున్న దే।
రత్నహారము దెగి వ్రాలెనిదుగో।

గీ॥ కాకె యీ పాటలన్నియు కలగ దిరిగె।
తెలియకుండుట నేరని తెలుసుకొనము
సఖియ యేమైతినుండెనో శంక రాజ్ఞ
వనితనుదుటను విధియెట్లు వ్రాసెనో క్కా!!

సుగు — అమగో యదుగో! నా విపినమందు మదిరా
క్షి విలపించినట్లు నాకర్ణములకు వినబడుచున్నది-

చంద్రి — అబ్బే! ఆ వెలలు గూయుచున్నవి కాదు
కాదు-ఆలాగు నేయున్నది గాన ఘూంరవంబును బట్టి జవం
బున నడుపుడి. (నిష్క్రమించుచున్నారు)

మీనా — యింతవరకు రోదనము వినుపించి యిప్పుడు
లేకుండ నేమ్మైగమైనా కాజేసెనా లేక, మూర్ఛపోయెనా-

సుగు — అదుగో యదుగో! బండరాతిమీద పడియున్నది-

చంద్రి — అయ్యయ్యో! యెంతగతి సంభవించెనేమో స్వామీ!

సీ॥ పటుభయంకరసింహ భల్లూకయుత కాన
సౌధమాయెనెనీకు చంద్రవదన।
కటకటా మిక్కిలి కరుకు పాషాణంబు
పూలశయ్యాసెకు పువ్వుబోడి।

జంబూక సిద్ధార్థ-సాలా దివృక్షము
లెల్ల లికతులా నీకు-కలువకంటి!
ఘనభీకరంబైన-వనవహ్ని లేనీకు
దీపంబులాయెనా దివ్యరదన!

గీ॥ యెన్ని జెప్పిన మామాట-సున్న జేసి
తానమిడనాడి యధికంపు-ధైర్యమూని
యేమికర్మంబె జత లేక-యిట్టిసాంద్ర
వనములో బడియుండనీ-వ్రాసిలటమ్మ!

అమ్మా! ఉలూచీ! రంగు చెలంగు పాన్పుపై పవ్వళించు దాన వీ రాళ్లపై బన్నుండుట నీ వ్రాతలే కొమ్మా (అని లేవనెత్తును.)

సుగు—మత్స్యకంటీ! మేమింత మంది నెచ్చెలుల ముండ మమ్ముల గయచేసి నీయిచ్చ వచ్చినట్టుల యీ దుర్గమ వనంబునకు వచ్చుటుచితంబే కదా?

చంద్రి—నెలతా మమ్ము బాసినిముషమైనను నిల్వ లేనిదానవిట్లు నిరాదరణ చేయుట నెనరేనటమ్మా. అయ్యో! తోడు లేకున్న మేడ వెల్పలకు పోవ భయపడుచుండెడి యుపీగా ఘరాత్రింబున యెట్లేతెంచితివే అమ్మా! యెంతటి దానవే సరి సరి. మంచిపని జేసితివి. గాని మన మందిరంబునకే తెంతమురమ్మా- (అని చేతులుపట్టుకు నడిపించు చున్నారు.)

రంగము—అంతఃపురము.

చంద్రి—తల్లీ! యెందు కాయాసపడెదవు? మెల్లగా గూర్చుండుము.

ఉలూ—చంద్రరేఖా! నాయందు ప్రేమకలదాన వైన యాబృందారకాధిపనందను దోడితెచ్చి నాకు బ్రాణదానంబుగల్గ జేసితివేని పదివేల వందనంబు లొనర్చెద సుందరీ నాదెస జాలిబూనుము-

గీ॥ కాంతరో వాని జూట్కల గాంచకున్న
నాదుమరణంబు నిజమని నమ్మవమ్మ
యతివరో నేను బ్రతుకుట హర్షమైన
మేఘనాదుని సుతునాదు మేడ జేర్చు॥

చంద్రి—కన్నియా! నే నెన్నివిధంబుల పరిచర్యలు చేసైనను కాయజుబాధ దొలంగింప నుపాయంబు గాన్పించ కున్నయది. గాన యా సుందరాంగుని దెచ్చెద. నీవు నీమందిరంబునకు పోయి నిశ్చింతగానుండుము-

ఉలూ—తల్లీ! నీకు నూరు నమస్కారములు. శీఘ్రముగా గొని తెమ్ము-

చంద్రి—దేవీ! పోయివచ్చెద (అని నిష్క్రమించుచున్నది.)

ఉలూ—చెలియలా! ముదంబున రమ్ము- (అని అందఱు నిష్క్రమింతురు)



# ఉలూచీపరిణయ నాటకము

## పంచమాంకము.

రంగము— గంగాతీరము.

చంద్రి—(తనలో) ఆహా! పార్థుండు భక్తిచేతను రచి మహాతపంబొనర్చుచున్నవాడు నాకిదియే మంచిసమయంబుగానున్నయది గానయీ చొక్కుమందును జల్లిగొనిపోయెదె (అని చల్లును.)

(విశారదార్జునులు భూమిమీద పడుదురు.)

చంద్రి—నా మాయాబలంబున యుండినర్జునుని ఉలూచిమేడకు గొనిపోయెదను- (అని తీసుకుపోవును)

రంగము— ఉలూచి అంతఃపురము.

(చంద్రరేఖ ప్రవేసించుచున్నది.)

చంద్రి—(తనలో) యిప్పురుషుని గనకపేరంబున నుంచి, ద్వారంబుకడనుండెద (అని యుంచి ద్వారపార్శ్వము నుండును)

అర్జు—అబ్బా! యెంతనిదురపోతిని (అని లేచి నలుదిక్కులు చూచి)

(తనలో) కం॥ ఎక్కడ కాసీ పురమది।
యెక్కడిదీ రాజధాని యెక్కడిగంగా
యెక్కడ ఘనసౌధంబిది
యక్కట యీనెలవు కెట్టులరిగితినో గదా

ఆహాహా! యేమి యాశ్చర్యము! వసనగుడారంబు విడచి యీపసిడిసౌధంబున నివసించుటకు గతంబెద్ది? యటు దర్భాసనంబున గూర్చుండువాడ నీయద్భుత కనకపీఠంబున గూర్చుండుటకు కారణంబేమి? గంగానది విడనాడి యీగంగళకరపురంబు బ్రవేసించుటెట్లు? నాప్రాణమిత్రుడగు విశారదుడు గాన్పించక యీమానినీమణి గన్పించుటకు హేతువెద్ది? ఔరా! ఎంతవింత! యేదోసకారులో మోసపుచ్చి నను దీసుకువచ్చెగదా దైవమా?

సీ॥ నను బాయలేకను వెనువెంటవచ్చిన
యగ్నిమిత్రుడే మాయెనో కో।
మాతల్లి యితరులచే తనాగతివిన్న
నెంతగా మదివిచారించునో కో।
నాలీల ధర్మజుండాలకించినతరి
ఘనవిచారంబెట్లు గడచునో కో।
నాదేసవినయులౌ వేఖరావళులెల్ల
డెందంబు లేకితిగుందునో కో।
గీ॥ యెట్టులీచోటునుంచినే నేగుదెంచి।
యెల్లవారికి భావుకంబుల్లమందు

గలుగజేయంగనుప మీమ్మిశామజనక
కృపనురక్షించు వేగమ్మకృష్ణశరణు॥
(అని విచారించి)

ప్రకాశముగా ఓకాంతా! యొంటరినిగాచుకు నీవునా చెంత నుండుటకు గతంబెద్ది?గంగాతీరంబుననున్న నన్ని మంగళాకరభవనంబు జేర్చినవారెవ్వరో యీసంగతి త్వరగాదెల్పుము లేనిచో నీ యుత్తమాంగంబు దుత్తునియలుచేసెద-

చంద్రి—సవ్యసాచీ! యీ లోకంబురగిలోకంబు కౌరవ్యుని ముద్దుకూతురగు ఉలూచి ఘనవార్యంబిది.యీమె నీపై వలపునిలిపి పలుదెరంగుల తపించుచు నన్ను నిలువనియ్యక నీ సొలసజూచిరమ్మన యోగిని వేషంబున నీకెలనకు వచ్చిన పాలతిని నేనుం గంగాతీరంబున నీవున్న సంగతివిని మాయంగన నిన్నురేయెల్ల సంగజబాధకులోనై బలుదెరంగుల చింతించుచూ తాళలేక జెచ్చెరగానిరమ్మని యానతిచ్చిన నిన్నిటదెచ్చితి గాన కోపగించక యీ శోకలవాటిని బాలింపుము-

అర్జు—ఆహాహా!(యని ముక్కుమీాద వ్రేలుంచి

గీ॥ యింతఘోరంపుపని మదినేమిదలచి।
జేసితివో నాకుచెప్పవేమోసకత్తె
కాంతనీమేనుముక్కముక్కలుగచేసి
కంకములకేను బడనెతుశంక లేక॥

కలిగే! నిన్ను ఖండించినను పాతకంబు లేదు-

గీ॥ పణతిరో లేశమాత్రంబు భయము లేక।
సహహ యెంతగయాళివే యధర్మరాతి
నింత పని జేసితివి గాస నిపుడు నిన్ను
నేమి చేసిన గిల్మిషం బెట్లు గల్గు॥

చంద్ర—చాలుచాలు! పట్టిదానికి తట్టుగాలియను గతి ««రవ్వారట్టాగంగా నమ్మదిని బొట్టాపోగులూ పోలేర మ్మవి,, యనుసామెత మరుక్రీడా విలాసంబులు మీావిని ?ి ?్బంబు నావీనా? (పో మామ్మా యని ఉలూచిని ముందరకు తోయును)

(అర్జునుండట్లు చూచి) (తనలో)

శాభాష్! శాభాష్! తొలకరి మెరుపువలె తళతళ మెర యుచున్న యీకలికిని వీక్షింప నాదేహము పులకరింపు చున్నయది-

ఉ॥ మారుని మేనమామనను మానము లేకను మీారు మోము
నయ్యారము వారి వాహముల కందము నేరుపుకొప్పు తమ్ము।
లన్। గేరెడి హస్తముల్ హరిని గిందుగ చేసెడి మధ్యమూనితా
మారుని బాణమో యనగ మానిని గన్పడు చుండె నాహాహా॥

కందర్పు పత్నిని గ్రిందు చేయగల సుందరంబుతో నీ మందయానను సృష్టించిన యిందిరాకొమరుని కౌశలంబెం తని గొనియాడుదు-

చ॥ బంభరవేణిగ్లానివలె • భాసిలుమోముకురంగవీక్షణ।
ల్బంభుని భూషయారువన • జంబులు నేత్రములున్ రథాంగ
ముల్।రంభసమానసుందరికి • రమ్యపుచన్నులు చిల్కపల్కు
లున్।రంభలమీరునూరువులు • రామశరీరిని మెంచశక్యమా

ఔరా! యీ పల్లవాధరిని వీక్షింప నా వళ్లు ఝల్లుమని యుల్లంబు తల్లడిల్లుచుండె-

ఉ॥ కల్వలగుంపులబ్జముఖి • కన్నులచేవికి నోడియగ్రత।
న్నిల్వగ లేక పోయిశుచి • నీరమునందున జొచ్చిఘసత్రము। న్వ
ల్వలబాలకొమ్మనిజ • వీక్షణలెత్తినయంతకాలము। న్వొల్వడ
కుండితొండముల • వెండియు రాత్రుల నిప్పెనత్కళన్॥

భళా-యీజవ్వని సుందరంబెన్న నెవ్వరితరమౌను?

(అని ప్రకాశముగా)

సీ॥ కొండలోకననకంపు • గుండలో నీదుపా
లిండులో దెల్పు వే • నండయాన।
తమ్ములో తుమ్మెదల్ • దిమ్ములో నీదునే
త్రమ్ములో దెల్ప వే • కొమ్మబోతి।
హారమో పసిడిబం • గారమో నీదుశ
రీరమో దెల్ప వే • వారిజాక్షి।
ఘనములో సుమనభ • క్షణములో నీశిరో
ధనములో దెల్ప వే • వనజపాణి।

గీ॥ భళిభళీ యింతలలితనం • పదఘటించి।
యువనిను జేయువిధి నేర్పు • రానుగాని

మానినీరత్నమని పేరఁ బొగ్చబడియె
వృద్ధుఁడగుటకును దనసూక్ష్మబుద్ధిఁ జెపియె॥

అతివా! యధికప్రయత్నంబుచే నన్నీహర్మ్యంబునకు దెప్పించిన కారణంబేమో జెప్పరముచ్చరింపుము. శీఘ్రంబుగా విచ్చేయవలెను.

ఉలూ.—(సిగ్గు నభినయించి) వన్నెకాఁడా! పీచారిత్రిలు విన్నదిమొదలు నీన్ను నాకన్నుల గట్టినట్లు గన్పించుచుండ నే నన్నహారంబులుమాని మిన్న బాధలనొంది నిన్నిట దెప్పించితి నాకన్నుల కరువైనను దీరకుండా పోయెదవనుట న్యాయంబే కదా? నా నెచ్చెలిచే నిన్నిపుడు విచ్చేయుటకే దెప్పించితినా? మన యిచ్చకొలంది ముచ్చటలాడుకొనుచు పచ్చవిల్తుని కేళిదేలి యొక పక్షమైన నుండక పోయెదవన్న నే బోవనిత్తునా?

అర్జు.—చాలు చాలూరకుండుము (అని తలద్రిప్పి)

గీ॥ తీర్థయాత్రలు సేయుచుఁ దిర్యపిలు
కేళిదేహంగ యుక్తంబె కీరవాణి
వెర్రిభ్రమలను జెందెదవేల నాకు
సమయమిది కాదు పోనిమ్ము జాగు వలదు॥

యింతీ! యీతీరున కంతుకేళికి రమ్మని రంతులు వెట్టెదవు యెంత వెర్రివే! యీదీక్షయందిట్టికృత్యంబులొనర్చిన మోక్షాభంగంబుగాన బోవనిమ్ము-

అయ్యో! పిశాచివలె నేనెన్నివిధంబులవచించినను విడువకుంటివిగదే? కాంతా! నిన్నేమనువాడ నా ఖర్మమెట్లున్నదో తెలియదు-

ఉలూ—సఖా! పరకాంతల గూడుట పాతకంబని బండితులు వచించిరి పోనీ యటుల నేగానిమ్ము పరిణయంబుగాని బణతిని నన్నే పురుషుని పత్నిగానియమింతువు? చాలుచాలు!

బేహాగ్ — ఆది — తాళం.

ఉలూ—సందియంబు జెంద నేల। సరగునరా రా।
కుందరదన నీకోమలమరయగ।
డెందమాపలేరా। నందనమిదే।
యిందువంశ సింధు। చంద్రగోత్రవరా॥ సందియ

అజు—యెందుకిట్టులాసింతువు। మందయానరో।
యందనిఫలముల కాసించినతరి। యిందునదోర
కున। సుందరినా యందుకోర్కె। పొందుపరచి।
నిందపొంద నియ్యకే ॥యెందు

ఉలూ—కరువుదీరనొక్కసారి। కౌగిలివ్వరా।
రమపురుషనీ దరిజేరితిన। న్నరమరసేయగ।
బరగదురా శరణాగత। నరులనేలు।
బిరుదుగల్గి యలరితే॥ సం॥

అజ—తగనిగోర్కె తీర్చమనుట। మానుపతగునే।

వగలాడిరో మీవారలు విన్నను। మిగులపరిహాసము జే

గునుసుమీ। నగమురాత్రి రయామువేళ తగవులాడసాగనే

వులా—మనోహరా! పేరుకెక్కిన పికుల ముదిమి

తిరని వింటి నాతో పికికి మాటలాడెద రేలా? అదియునుంగా

క వర్షించువాడు తనవాడైన దో కడబంతినుంచు మను సా

మిత నాకు హాపకమై నీతో పరసంబులాడుకొనుచుండు

దాన. నేనుండ నీకు భయంబేల-

ఉ॥ వాసవి యెందుకిట్లనను వంతలు వెట్టుట మేలుగాదునీ।
కోసము నే పరిత్యాసనొక కోకిలవాణిని బంపి తెచ్చితిన్।
యాసను దీర్చకే జనెద వంచును బేరములాడుచుంటివో।
దోసము సంభవించు జుమి దూరము జూచుచు వేగిరింపకన్

ప్రియా! నాకామంబు దీర్చక నేగితివేని గలుషంబునొందు

ట నిశ్చయంబు గాన నీమనంబు నాలోచింపుము-

(అని నిష్క్రమించును)

అజ—(తనలో) ఔరా! నేనెన్ని విధంబుల చెప్పినను యీ

కన్నియ విడువకున్న యది పోనీ యీసమయంబున బోవుద

మన్నను తోచదెలియకుండె దైవమా! నేనేమిసేయువాడ-

—హిందుస్థాని తోడి—ఆది తాళం—

వనజనేత్రి వగచరిత్రి। నిను భజించెదన్।
కనకవసన సనకుడాది। మునిమనాహ్లాదా। కారుణించరా।
విని యువిదని యట్టులుండ। ఘనమె మురహరా॥ వనజ॥

జననమాది నీదుసేవ నల్పుచుంటిరా। హా నా జాస్య నా।
మనవివినవదేరదూర మననకనికరా॥వనజ॥
వారివాహ నీలదేహ కోరియుంటిరా। మా రా సుంద రా।
వేరుచేయతగదు బ్రోవు। విసుధరాధరా॥వనజ॥

సుకాంతివృత్తం—నమోనమో? రమాపతీ క్షమించి దోష మార్పరా॥మురహరా నాముద్దు రాలకించి యీసౌధంబు దాటుటకు తెరవెద్దియో తెలియజేయ వేడెద.

(ఉలూచి ప్రవేసించును)

ఉలూ—మానవేంద్రా! నాయన వాలకించి నన్ను మన్నించవుగదా. (అని ముద్దు పెట్టుకొనబోవును)

అర్జ—గీ॥ దగ్గరకురాకు పణతిరో దవ్వునిలచి।
మాట చెప్పంగవలె. గాని మోటవశువు।
రీతిమీదకువచ్చేవు నీతిలేక।
యింక నిట్టులొనర్చితే బింకమణతు॥

ఛీ ఛీ! నీతిలేక మీదకు వచ్చితివేని నాచేతనున్న ఖడ్గంబుచే నీ సిరంబు త్రెళ్లనేసెద దవ్వనుండుము.

ఉలూ—అవు నౌను! పూరిచి పెట్టినను పుట్టివంకే జూచెననుసామిత అలరవిల్తునిగోళికి పలుమారు రమ్మటంచు బల్కుచున్న కొలందీ వలదనుచున్న నిన్ను వలసియుండుట చేత నీతిమాలినదాననే.

బేహాగ్గ—అది—తాళం.

ఉలూ—మగువలద్యంచెడి। మగవాడ వెరీ।
త్యాగుపడుచుండెనురా। మ।జాగూచేయుసల మా
మరుని। జన్యామూచేయాకనిముప।
మాగ లేను రమ్మటన్న। వాగెదవు॥మగు॥

౨జ—చాలుచాలు! బాలరోనా।
జోలినీకేటికి సరిసరి। పోపోవే। చా।
వీలూలేకమూరు। కేళిదేలనొప్పకున్ననన్ను।
లోలానేనిగ్రి నీచుడన్న। లోపము జే॥చాలు॥

ఉలూ—మీాసము లేదురి। వాసవినీకొగ।
కాసపడగనేలా। మీా।
దోసకారి బ్రిహ్మానిన్ను। తొయ్యలీగచేయబూని।
మోసపోయి పురుషుని। జేసెనురా॥మగు॥

అజ—ధాతమరచినా। తరుణిరొజాణవు।
హేతువేమి మరువ। నీతిమాలి।
నన్ను నీకు। ఖ్యాతిగాదు రమ్మటంచు।
భీతి లేక। రతికై పిలచెదవు॥చాలు॥

ఉలూ—

ఉ॥ గోప్యము లేక భామినులు,గూరిమిపూరుషులన్వరించినా।
మీాప్యముజేరివేడినద,మింపగ చేతురె యెట్టివారలు
న్బ్రాప్యవిమోహులైనతరి,బాసలుసేయుచుదీనవృత్తిచే
శాప్యముపెట్టుచున్నవిడ,జాలరుకాంతులునే నెరుంగుదున్॥

అర్జు — నెలతా! నీ వెన్నియైనను నేర్చినదాన వే-

కం॥ గంగానదితీరంబున।
సంగడికాడేను నుండ చతురతనన్ని।
మంగళకరభవనంబున।
యంగన బంధింపచేసి తహాయేమందున్॥

కం॥ యింతటిదానవు గనుకనె।
బంతంబున్ననన్ను సఖుని బాపియుసనుని।
మంతినము జేర్చుకొంటివి।
కాంతలమాయనుజయింప గలుగునెవినికిన్॥

ఉలూ — కాంతా! యింతులమాయ జయింపరా దు- జయింపగాదని వింతగా బల్క నేటికి? నీసంతసమున్న చోటుకేగుము. నేనంతకంతుబారి కోర్వలేక యుంటినా యేదైనా యొక గరళముమ్రింగి యైననూ నివారించుకొని యెద. (అని తెరలోనికి నిష్క్రమించును)

అర్జు — (తనలో) కటకటా! చనిపోవునేమో కదా? యీ బాలామణి యిచ్చవచ్చినటు లేలనియ్యకొనకుంటిని ఆయిన ను గొంచెము కవాటము తీసిచూచెద (అని తెరయెత్తును)

జంఝూటి — ఆది — తాళం.

ఉలూ — సరిసరిసరి। యెవ్వడవుర యీనిసి।
సమయమునిటులరు। దెంచితివి।
తరుణులు। మందిరములకును।
బురుషులురా। బరగునే॥ సరి॥

నిలునిలు। మావారలతో దెల్పినీ।
బలుగర్వంబును। దొలగింతున్।
లలనలున్న గెలనుకేగ। చులకననుచు। దలచితే॥సరి॥
తగుతగురానీ। మొగము దొంగవటె!
నగుపడుచున్నది చూడగను। నగము గాత్రి।
మగువలకడ నగలుకోయు। తగునురా॥సరి॥

(శ్రీ) రాగం—ఆట—తాళం.

అజ—(భయమునభినయించి) న్యాయముగాదే।
తోయజానేత్రిరో। న్యాయ। నీమొఁనే నేసి।
నపాయములేదే। న్యాయ।ఏమెరుగని వానిబట్టి।
నీమందిరములోనం జెట్టి।రామా యపవాదమా ।
యు। భామా మఃకిరో చెల్లునే।।న్యాయ॥
పాపామను చూసీమద। నేనాటియుదాలించక।
కోపదృష్టి నాపైనిక। జూపక బోవవే॥న్యాయ॥

ఉలూ—అజనా! రక్షించను, శిక్షించను మీ వం
టి రాజేంద్రులకు చెల్లునుగాని మేడలమధ్య బడియుండెడు
యూడుదాననను నేనేమి చేయగలదాన-

అజ—కాంతా! యిట్టిసమయంబున పొలతులకు
న్నవాడి పురుషులకుండునా? యుండనేరదు.

ఉలూ—

మ॥ సరసీజాతనసంబునే నెరుగుదున్,సంతోషమూనెన్నఁ।
మరిన్ స్త్రీల చాయబోకుమికని,మాతృలీల నెనన్ గల్గితే।

తరుణి న్నే నన నెంత దానగనుక న్‌దాటోటు వాక్యంబు లన్
నరిజేసేగుము మేడవెల్పులకునీ జంఝూటముల్ సాగునే॥

నీ నడవడంతయూ దెలసె. తడవుండిన బెడిదంబైన మర్యాదనంభవించు గాన నుడువులు విడచి యీ ఘడియ యందునే వెడలిపొమ్ము-

అర్జు—

మ॥ తరుణీమాటలకేమిగాని వినుతీ క్షాదీ క్ష చేబల్కు-వా।
క్సరణినాక్రనుమిగొమ్మ యాత్రి నెపమున్ చాలాశ్రి మన్
బొందినీ। కొరకేగాదిటు లేగుదెంచితినినీ కోపంబుచాలించి
నే। గురుకారుణ్యముచేత నీమనమునా కుంధారబ్రొయ్యే చెలీ।
వనితా! నేఘనప్రియానవొంది నినుగురించియేకదా?
సకలరాజ్యంబులూ దిరుగుచూ వచ్చితి—

బేహాగ్గు—ఆది—తాళం.

ఉలూ—ముదితలనమ్మిన। మోసమటంచున్।
యెదగనుగొంటివి। యేటికిరా యీ।
మదిహీనపువాక్యములను। మరలబల్క-బోకురా।
చెలులను నమ్మగూడదని।పలుమరుబల్కి-యునీ
తెలివిహీనపు। మాటలేల॥ పోపొమ్ము॥

అర్జు—కలికిరొపొమ్మని। బల్కి-నంత నే।
జలకనబోవగ। జూతున టే నే।
చిలకరాతు బారినిబడి। చిక్కు-లొందుచుంటినే॥

పణతీ! నిను బడయుట్కై యడవులంబడి కడు పిడుములు పడుచూ విడువని మక్కువచే వచ్చిన నన్ను చిడుముడి పెట్టుట నడవడిగాదు- కించతాలోచింపుము-

ఉలూ——కం॥ మక్కువగలదనియూరకె।
పెక్కులువల్కంగనేల, బేలనె నేనీ
టక్కరివేషము విరటుని
చక్కనిజనుగాని యుచట, సాగదువిజయా॥

అర్జు——

చ॥ నెంతలువల్కువాక్యముల, నేరముకించతు లేదుపూరుషా
వళి పెడవెత్తదోషమగు, వారలు సేసిన బుణ్యమేమిటో।
తెలియదు రెండుజాతులస, తీనివహం బెఘనంబుచూడనీ
యిలననిదోచు నామదికి, నెంతవిచిత్రమొకాలవైఖరుల్

అంగనా! గంగానదియొడ్డనున్న నన్ను భంగపుచ్చి నీవంగడికత్తెచే దెప్పించి యంగజకేళికి రమ్మనుట నేరము లేదుగాని వెరచుచూ వెరచుచూ కొంచము తలుపు తెరచుట దోషమా? అంతమాత్రంబున చోరుడను,జారుడను, కూ్రరుడను, వేషధారుడనున్నా? కాంతా! యెంతో వింతగానున్నది-

ఉలూ——సీ॥ చోరుడన్నంత నే, జారచురమన నేల
పాలుము్రచ్చిలడెనీ, భావమరిది।
జారుండవనన హం, కారంబురానేల
నసురనుగూడ డే, యగ్రజుండు।

కూర్చుండవన్నంత కోపంబునీకేల
  కలుషుండనుగాదె నీకర్జునుడనన్న!
వేషధారుడవన్న కోపంబుపడనేల
  వినుబ్రహ్మచారి నన్నలయావు గొనవెనీవు!
గీ॥ వాసుదేవాదినిబంధు వర్గమునకు
కలుగుగుణములే కలవన్న గరిత మేల
హితవు లేనట్టి దినములు నెంతమంచి
భాషణములైన దప్పుకా ఫల్గుణుండ॥
అర్జు—అట్లు కాదుకాదు!
సీ॥ అతివనామాయవాక్యములలో బడి నేను
  మాయవేషుడ నన్న మంచిదేను!
సుదతి నీహృదయంబు సూరగానిడి మీద
  చోరుండనన్నను శోభనంబె!
కలికి నీకుచములు నాలి వెట్టగానిచ్చి
  కూర్చుండనన్నను కుహుక మేనె!
మదన కేళిలనన్ను మన్నించి తరువాత
  జారుండవన్నను సమ్మదంబె!
గీ॥ గాని నిష్ఠేత్తరంబుగా లేనిపోని
హీన సంభాషణలు సేయనేలనీదు!
మేడ చేరితినని దూల నాడబోకు
దంతు గట్టుకునియున్నంట నుండబోను॥

కలికీ! నీపలుకులు కర్ణంబులకు ములుకులై నాటుచున్న
ను చిలక గోరుశారిని బదులచే చులకనై దోచుచున్నవి.

ఉలూ——కిరీటి! యేమి యాశ్చర్యము!

క॥ పగకాంతిమలనుగూడిన।
నరకంబని హృదయమందు॥నాటినగుణముల్
మరుబారిపడుదువేసను।
వెరపించుటగాని నిజమె॥వెర్రినెపార్థా॥

అర్జు-

మ॥ కలికీ నెక్కుడుమాటలింకననకో॥కన్గవ్వ విల్కాడితూ
పులబారిన్బడకోర్చియుం గొనియుమిగులన్॥బుద్ధిశ్లాఘనైనామది
గ్గలకోర్కెన్ సఫలంబుచేసినను సా॥గంబోలవేరిత్తు మా
టలనేమున్నది యెందుకీపలుకులనుదం॥టాలెక్కసేటికో మలీ॥

ఉలూ——(నవ్వుచూ) అవునౌను! యెన్నికంతులుగో
సినను తన కంతియంత నొప్పిలేదను సామెతనున్నది. నిన్న
నే బ్రతిమాలించిన నీమది చిన్నమయ్యెను గదా గనా- అప్పుడు
నాకును యింతకష్టంబుగానున్నది-

అర్జు——కలికీ! యేమిటో వక్కాణించెదవుగాని నా
కు గ్రాహ్యంబు లేదు-

సీ॥ మరుకేళిదేలర॥మ్మను వాక్యమునుగాక
నేరువాక్యంబుల॥వినవుచెవులు।

మిగుల మనోహరం బగు నీదురూపము
క్కొటిగాక నిక నేమి గనవుకనులు।
మధురమైనట్టిని య్యధరమ్ముక్కొటిగాక
కబళింప దేవంట కములనోరు।
బింక మానీకుచ పంక జంబులగాక
ప్రాణిద్వయము దేని బట్టబోదు।
గీ॥ యిట్టి నాతోడ నీమది గట్టిపరచి
బలుకుచున్నట్టిపలుకుల దలచిచూడ।
బధిరునకుశంఖమూదిన బగిదిగాదె
భామచాలించునీదునం భాషణముల॥

ఉలూ—కిరీటీ! నీవంత యస్వాధీనేంద్రియుండవ య్యుంటివా?

క॥ మాటల తేటలు తేనెల
సాటియు మధుమక్షికాళి నవహ్యాయమునీ
తోటిక భాషింపగనా
కేటికినీ వలయుచోటి కేగుము విజయా॥

అర్జు—కొమ్మా! మాటిమాటికీ పొమ్మనేబల్కుచుంటివే

బేహాగ్గు—ఆది—తాళం.

1 కాంతా నినునే గూడకుంటినా। గాల్పనయీదేహం బహాహా। గాల్పన యీదేహం।
బింత్రి నీకుచ బంతులానిటు।పంత మూనకియ్యవే॥

2 మక్కువదీరా చెక్కు చురుక్కున। నొక్కనియ్యో
భామా। చరాలున। నొక్కనియ్యో భామా।
నొక్కనిముప పూర్వజాల।చిక్కులానొందించకే॥

3 కలకటచాలా భ్రాంతినుంటి నన్నెటులబ్రోచెదవో
చెలీ।నన్నెటులబ్రోచె దావో।
కుటిలుడైన। గుసుమశరుడు। పటిమజూపుచుండెనే॥

4 పోని యావలకేగుడమన్నను। మానస మొప్పదుగా
సతీ!।నా మానసమొప్పదుగా
ప్రాణమైన। బాయుదూనిను। చానవిడువ జాలనే॥

5 కొమ్మానిన్నే నమ్మియుంటినే। గోపమువచ్చినను।
మనోహారి కోపము వచ్చినను।
బొమ్మటన్న। బోస్మరతికి। సమ్మతించి బ్రోవవే॥

సతీ! నెబ్రతుకుట హితవైన నా కుతుకంబుదీర్చుము-
లేనిచో నీ కోపంబునే నెరవేర్చుకొమ్ము.

(అని తల వాల్చును.)

కం॥ హృదయేశ యూరకేనిను।
బెదరించిన నేమిగల్గు, భీతేలనునే
నిదిమొదలు నీదుసొమ్మును
మదిగల్గిన యట్లొనర్చు, మారననింకన్॥

వాసవీ! నీకోసరమింత ప్రియాసపడి నీ ప్రాణంబు

లు పోవుట చూచుదాననా? నేను నియ్యధీనంబు నీ సమ్మానప్రాణంబులం జేసుకొనుము- (అని కౌగలించుకొనును)

అర్జు—(గడ్డము పట్టి ముద్దుపెట్టుకొని)

శా॥ కాంతా నీకిక నాగలోకమున కొనసాగన్ బ్రహ్మానందం
బున॥ స్వాంతంబుల్ నరు గంగ చేసి మనలన్ సంప్రీతిగా కన్న
నే॥ నెంతో ధన్యుడనే మదీయవిభవం బేమంచు దెల్పన్ భ॥
చింతాసాగరమీది యుక్తుబడితిం జేశానే ముదంబొప్పగ

సుందరి! యపరిమిత వైభవంబున మును నైనాకంబొసగ్చుకొందము- గాంధర్వవివాహంబుగా నిప్పుడు మన రాంగుళీకంబుల మార్చుకొందమిట దెమ్ము. యిదిగో కొమ్ము

(అని యుంగరంబులు మార్చుకొని)

కోమలీ! యదిగో కుక్కుట ధ్వనులు వినబడుచున్నవి. జాగుచేసిన బాగులేదు- వేగమే క్రీడాగృహంబున కేగుదము రమ్ము- (అని చెయ్యిబట్టుకులాగును.)

(నిష్క్రమించుచున్నారు.)

సంపూర్ణము